

# అబూ కీర్ సీర్

ఒకప్పుడు అలెగ్జాండ్రియా నగరంలో అబూ కీర్ అనే కలంకారీవాడూ, అబూ సీర్ అనే మంగలివాడూ నివసించేవారు. వారి దుకాణాలు పక్క పక్కనే ఉండేవి.

అబూ కీర్ పరమనీచుడూ, అబద్ధాల కోరూ, వట్టి పాపిష్ఠివాడూనూ. ఎలాటి పాడు పని చెయ్యటానికైనా వాడు సంకోచించే వాడు కాడు. ఎవరన్నా అద్దకం కోసం వస్తే వాడు రంగులు కొనాలని ముందుగానే డబ్బు తీసుకునేవాడు. ఆ తరవాత అద్దకం వెయ్యవలసిన బట్టలే మాయమయేవి. ఖాతాదార్లు ఇచ్చిన డబ్బు కాజెయ్యటమే గాక, వాళ్ళ బట్టలు అమ్మేసి, తినటానికీ, తాగటానికీ, వినోదాలకూ ఖర్చు చేసేవాడు. ఖాతాదార్లు వచ్చి అద్దకం పూర్తి అయిందా అని అడిగితే, ఇదుగో, అదుగో అంటూ తాత్సారం చేసేవాడు. "అల్లా మీద ఒట్టు! నా భార్య నీళ్ళాడింది. నాకు ఊపిరి సలపటం లేదు," అనో, "ఇంటి నిండా బంధువులు వచ్చి ఉన్నారు. రెండు రోజులు ఆగారంటే, మీ పని పూర్తి చేస్తాను," అనో, మరొకటో సాకు చెప్పేవాడు.

ఖాతాదార్లు కొందరు ప్రాణం విసిగి, "నిజం చెప్పు. నా బట్టలు ఏం చేశావు? నీ అద్దకమూ వద్దు, నువ్వూ వద్దు. నా బట్టలు నాకు పారెయ్యి," అని నిలవదీస్తే, అబూ కీర్ మొహమూ, నెత్తీ బాదుకుని, వగల ఏడుపులు ఏడుస్తూ, "నేనేం చేసేది, బాబుగారూ? మీ బట్టలకు రంగు వేసి ఆరేసి, లోపలికి వెళ్ళి వచ్చి చూద్దును గదా, అవి కాస్తా మాయమయాయి. నా పొరుగున ఉన్న మంగలాడి పనే అని నా అనుమానం," అనేవాడు.

ఖాతాదారు కాస్త పెద్ద మనిషి అయితే, "అంతా దేవుడి నిర్ణయం!" అనేసి వెళ్ళిపోయేవాడు; అదే కోపిష్టివాడైతే నడి రోడ్డు

అరేబియన్ కథ

మీదనే కలంకారీవాడితో దెబ్బలాటకు దిగేవాడు.

అబూ కీర్ ఖాతాదార్లు ఎంతోమంది న్యాయాధికారి వద్ద ఫిర్యాదు చేశారు. కాని అబూ కీర్ వద్ద ఎవరూ నష్టపరిహారం పొందలేకపోయారు. ఎందుచేతనంటే వాడి దుకాణంలో జప్తు చెయ్యటానికి ఏమీ ఉండేది కాదు.

అబూ కీర్ ఇలా కొంతకాలం గడిపినాక వాడి ధోరణి అందరికీ తెలిసి పోయింది. అబూ కీర్ అంటే నమ్మకద్రోహానికి మారు పేరు అయింది. వాడికి పొట్ట గడిచే మార్గం లేకుండా పోయింది. ఒక రోజు వాడు మంగలి అబూ సీర్ ఇంటికి వచ్చి తాను తిండికి మాడేదశ వచ్చిందని ఏడ్చాడు.

అబూ సీర్ పేదవాడైనా ధర్మాత్ముడు; గొప్ప నిజాయితీపరుడు. అతను అబూ కీర్ స్థితికి జాలిపడి, ''పొరుగు వాడికి సహాయపడటం ధర్మం. నీకు కాస్త మంచి రోజులు వచ్చేదాకా నా యింటనే ఉండి, ఉన్నంతలో కడుపు నిండా తిను,'' అన్నాడు.

అబూ కీర్ మంగలి ఇంట చేరి తన అవసరాలన్నీ జరుపుకున్నాడు.

ఒకనాడు అబూ సీర్, అబూ కీర్‌తో, "అన్నా, నేను మంగలిపనిలో అసమర్థుణ్ణి కాను. కాని నేను పేదవాణ్ణి కావటం చేత నా దగ్గిరికి జనం రాకుండా ఉన్నారు. నా సంపాదన నీకూ, నాకూ, నా సంసారానికీ చాలకుండా ఉన్నది. అల్లా కటాక్షం ఎలా ఉండబోతుందో మరి!'' అన్నాడు.



దానికి అబూ కీర్, "అన్నా, నీ వృత్తి సరిగా జరగటం లేదంటేనూ, నా వ్యాపారం దెబ్బ తిన్నదంటేనూ, దానికి కారణం ఏమిటనుకుంటున్నావు? ఈ ఊరివాళ్ళు పట్టి దుర్మార్గులు. ఎంతో సంపాదించగలిగి ఉండి కూడా, నువు ఇలా కష్టాలు పడటం ఏమీ బాగా లేదు. ఈ దిక్కుమాలిన దేశం వదిలి పెట్టి మరే దేశానికైనా వెళ్ళామంటే మన విద్యలు రాణిస్తాయి. మనకు మంచి గిరాకీ ఉంటుంది. దేశాలు తిరగటంలో ఎంత ఆనందం ఉన్నది! మహా మహా నగరాలు చూడవచ్చు. రెండు చేతులా ధనం ఆర్జించవచ్చు. దుకాణం మూసేసి మరే దేశానికయినా ప్రయాణం అవుదాం పట్టు!" అన్నాడు.

అబూ కీర్ మాటలు అబూ సీర్‌కు సంగీతంలాగా వినిపించాయి. అతను తన మంగలిపొది సర్దుకుని, ప్రయాణానికి సిద్ధమయాడు. బయలుదేరబోయే ముందు అబూ కీర్ ఇలా అన్నాడు:

"మనం ఇక నుంచీ సహోదరులలాగా ప్రవర్తిస్తామనీ, ఇద్దరి సంపాదనా కలబోసుకుని సమంగా అనుభవిస్తామనీ, ఎవరికి ముందు పని దొరికినా రెండోవాణ్ణి పోషిస్తామనీ ప్రమాణం చేసుకుందాం."

అబూ సీర్ ఇందుకు సమ్మతించాడు. ఇద్దరూ కలిసి కొరాన్ పఠించారు. తరవాత వాళ్ళు తమ వెంట తిండి అయినా తీసుకోకుండా రేవుకు వెళ్ళి, ప్రయాణం కావటానికి సిద్ధంగా ఉన్న పడవ ఎక్కారు.





ప్రయాణం వాళ్ళకు అనుకూలించింది. ప్రయాణీకులు నూటనలభై మంది ఉన్నారు. వారికందరికీ మంగలి అబూ సీర్ ఒకడే. అతను తన మిత్రుడితో, "అన్నా, మనకు తిండి కావాలి గనక, ప్రయాణీకులుగాని, పడవవాళ్ళు గాని క్షౌరం చేయించుకుంటా రేమో చూస్తాను. వాళ్ళు రొట్టె ఇచ్చినా, డబ్బులిచ్చినా మనకు ఉపయోగమేగద!" అన్నాడు.

"తప్పకుండా వెళ్ళిరా!" అని అబూ కిర్ కాళ్ళుచాచి పడుకుని నిద్రకు పడ్డాడు.

అబూ సీర్ ప్రయాణీకుల మధ్యగా తిరుగుతూంటే ఒకడు అతన్ని పిలిచి, తల గొరిగించుకుని, డబ్బు లియ్యబోయాడు.

"అయ్యా, ఈ ప్రయాణంలో డబ్బులు ఎందుకు అక్కరకు వస్తాయి? నాకూ, నా మిత్రుడికీ తిండి లేదు. ఇంత రొట్టె ఇయ్యండి," అన్నాడు.

ప్రయాణీకుడు మంగలికి రొట్టె ముక్కా, జున్నూ, నీరూ ఇచ్చాడు. అబూ సీర్ వాటిని తీసుకుని పడవ పై భాగానికి తిరిగి వెళ్ళి, అబూ కిర్‌ను నిద్ర లేపి, తాను తెచ్చిన ఆహారాన్ని చూపాడు. అబూ కిర్ జున్నుతో రొట్టె తిని, మంచి నీరు తాగేశాడు; అబూ సీర్‌కు ఏమీ మిగల్చలేదు.

అబూ సీర్ రోజల్లా ప్రయాణీకులకు క్షౌరాలు చేసి, ముప్ఫై రొట్టెలూ, బోలెడంత జున్నూ, దోసకాయలూ, ఇతర తినుబండారాలూ, పదిహేను దిరాములు నగదూ సంపాదించాడు. ఇంతేగాక ప్రయాణీకులందరికీ అతనంటేనూ, అతని పనితనం అంటేనూ మంచి అభిప్రాయం కలిగింది.

అతన్ని గురించి పడవ సరంగుకు త్వరలోనే తెలిసింది. ఆయన అబూ సీర్‌ను పిలిపించి, తాను కూడా క్షౌరం చేయించుకున్నాడు. అబూ సీర్ క్షౌరం చేస్తూ తాను అనుభవించిన దారిద్ర్యం గురించీ, తనపై ఆధారపడి ఉన్న కలంకారీ వాణ్ణి గురించీ సరంగుతో మాటవరసగా చెప్పాడు. సరంగు ఉదారుడు. అబూ సీర్ అంటే ఆయనకు కూడా సద్భావం కలిగింది. ఆయన అబూ

సీర్‌తో, "ఈ ప్రయాణం సాగినన్నాళ్ళూ ప్రతి సాయంత్రమూ నువూ, నీ స్నేహితుడూ వచ్చి నాతో కలిసి భోజనం చెయ్యండి," అన్నాడు.

అబూ సీర్ తిరిగి వచ్చేసరికి అబూ కీర్ నిద్రపోతున్నాడు. అతను లేచి తన పక్కన పోగువేసి ఉన్న ఆహారపదార్థాలు చూసి, "ఇవన్నీ ఎక్కడివి?" అని అడిగాడు.

"అల్లా కటాక్షం!" అన్నాడు అబూ సీర్.

అబూ కీర్ ఆత్రంగా ఆ పదార్థాలన్నిటినీ తిన నారంభించాడు.

"అన్నా, అంతా ఇప్పుడే తినకు. రేపటికి కొంత ఉంచు. అదీగాక పడవ సరంగు గారు మనిద్దరినీ రాత్రికి భోజనానికి పిలిచారు," అన్నాడు అబూ సీర్.

"నేను రాలేనులే. నాకు పైత్య వికారంగా ఉంది. ఈ వస్తువులే కాస్త ఎంగిలి పడతా!" అంటూ తినసాగాడు అబూ కీర్. అతను తినే పద్ధతి భయంకరంగా ఉన్నది; ఆహారం నోట కుక్కుకుని, పెద్ద చప్పుడుతో దిగమింగాడు.

అబూ కీర్ తింటూ ఉండగానే సరంగు గారి మనిషి వచ్చి, వారిద్దరినీ భోజనానికి పిలిచాడు. తనకు పైత్యవికారంతో ఒళ్ళు తూలు తున్నదనీ, రాలేననీ అబూ కీర్ అన్నమీదట అబూ సీర్ ఒక్కడే భోజనానికి వెళ్ళాడు.




అతను సరంగుగారి గదికి వెళ్ళేసరికి సరంగుతో కలిసి భోజనం చేసేవారు మరి కొందరు కూడా ఉన్నారు. ఆహారపదార్థాలు రకరకాలవి వడ్డనకు సిద్ధంగా పెట్టి ఉన్నాయి.

అబూ సీర్‌ను చూసి సరంగు, "నీ మిత్రుడెక్కడ?" అని అడిగాడు.

"సముద్రప్రయాణం అతనికి పైత్య వికారం చేసింది," అన్నాడు అబూ సీర్.

"అది త్వరలోనే పోతుందిలే," అంటూ సరంగు అబూ సీర్‌ను తన పక్కనే కూర్చొబెట్టుకుని వడ్డన చేయించాడు.

భోజనాలు అయిపోయి అబూ సీర్ తిరిగి వచ్చేటప్పుడు సరంగు ఒక పెద్ద పళ్ళెం నిండా భోజనం పెట్టించి అతనికి ఇస్తూ,

"దీన్ని తీసుకుపోయి నీ మిత్రుడికి ఇయ్యి." అని చెప్పాడు.

అబూ సీర్ ఆ పళ్ళెంతో తన మిత్రుడి వద్దకు తిరిగి వచ్చి, "నేను వద్దంటుంటే వినకుండా ఆ సాదా తిండి తిని ఆకలి పాడు చేసుకున్నావు. సరంగుగారు నీ కోసం ఎలాటి భోజనం పంపాడో చూడు. ఇలాటి కబాబ్‌లు ఎప్పుడన్నా తిని ఎరుగుదుమా?" అన్నాడు.

"ఇలాతే!" అంటూ అబూ కీర్ పళ్లెం అందుకుని, ఆకలి మీద ఉన్న తోడేలు లాగా, రెండు చేతులా ఆవురావురని తింటూ, క్షణంలో పళ్లెం ఖాళీ చేసేశాడు.

ప్రయాణం ఇరవై రోజులపాటు ఇదే తీరున సాగింది. అబూ సీర్ రోజూ ప్రయాణీకులకు క్షౌరం చేసి, వారిచ్చినవన్నీ చేర్చి పెట్టేవాడు; రాత్రి పూట సరంగుతో కలిసి విందు ఆరగించేవాడు. అబూ కీర్‌కు తిండీ, నిద్రా తప్ప మరే పనీ లేదు.

ఇరవైఒకటో రోజు ఉదయం పడవ ఏదో కొత్త నగరం రేవు చేరింది. అబూ కీర్, అబూ సీర్ నగరంలోకి వెళ్ళి, ఒక సత్రంలో ఒక చిన్న గది కిరాయికి తీసుకుని, తమకు కావలిసిన చాపలూ అవీ కొనుక్కున్నారు. వీటన్నిటికీ డబ్బు అబూ సీరే ఇచ్చాడు. అబూ కీర్ తన కింకా పైత్యం దిగలేదనటం చేత, అతన్ని గదిలోనే పడుకోమని చెప్పి, అబూ సీర్ తన పొది చంకన పెట్టుకుని, సంపాదన కోసం నగరంలోకి వెళ్ళాడు. అతను ఏ వీధి మూలనో మకాం పెట్టి తన వృత్తి చేసుకున్నాడు. మొదట్లో అతని వద్దకు కూలీలూ, వీధి బేరగాళ్ళూ, గాడిదలను తోలుకునే వాళ్ళూ మాత్రమే వచ్చారు. కాని రాను రాను అతని పనితనం తెలిసి పెద్ద పెద్ద వర్తకులు కూడా రాసాగారు.

అబూ సీర్ సాయంత్రం దాకా పని చేసి, ఆహారపదార్థాలతో గదికి తిరిగి వచ్చి, రోజల్లా నిద్రపోయిన కలంకారీ వాణ్ణి లేపేవాడు. వాణ్ణి లేపటానికి వేరే ఏమీ చెయ్యనక్కర్లేదు. ఏ వండిన మేకమాంసమో వాడి ముక్కు దగ్గిర పెట్టితే చాలు! తరవాత ఇద్దరూ కడుపు నిండా తినేవారు.

—(ఇంకా వుంది)





# అబూ కీర్ / సీర్

## 2

నలభై రోజులు గడిచిపోయాయి. తన పైత్య వికారం తగ్గలేదని అబూ కీర్ అంటూనే ఉన్నాడు; అబూ సీర్ వాణ్ణి మేపుతూనే ఉన్నాడు. అబూ కీర్ రెండు పూటలా కడుపు నిండా మెక్కేవాడు; కాని, "నగరం ఎంత అందంగా ఉందనుకున్నావు! దాన్ని చూడని జన్మ ఎందుకు?" అని అబూ సీర్ అనగానే, తన పైత్యవికారం మాట చెప్పి, పడుకుని నిద్ర పోయేవాడు అబూ కీర్.

ఇన్ని రోజులూ అబూ సీర్ తన మిత్రుణ్ణి మాట వరసకైనా మందలించిన పాపాన పోలేదు.

ఆ తరవాత మంగలి అబూ సీర్ జబ్బు పడి, బయటికి వెళ్ళలేక పోయాడు. అబూ కీర్‌కు కావలసిన ఆహారం తెచ్చిపెట్టుతూ, అతన్ని కనిపెట్టి ఉండమని అబూ సీర్ సత్రం దర్వానును బతిమాలాడు.

కొద్ది రోజులకల్లా అబూ సీర్ వ్యాధి ముదిరింది. అతను ఒళ్ళు తెలియని స్థితిలో శవం లాగా పడి ఉన్నాడు. అబూ కీర్‌ను ఆకలి మంట పక్క మీది నుంచి లేవగొట్టింది. అతను లేచి, తినటానికేమన్నా ఉన్నదేమోనని గది అంతా గాలించాడు. అతనికి ఏమీ దొరక లేదు. అబూ సీర్ దుస్తులన్నీ గాలిస్తే డబ్బు సంచీ దొరికింది. అది అబూ సీర్ చెమట ఓడ్చి కూడబెట్టిన కష్టార్జితం. అబూ కీర్ దాన్ని బొడ్లో దోపుకుని, అబూ సీర్ గతి ఏమవుతుందన్న విచారం ఏమీ లేకుండా, గది తలుపు బయటినుంచి గొళ్ళెంపెట్టి, ఎటో వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోవటం దర్వాను ఎరగడు.

అబూ కీర్ తిన్నగా ఆహారాలమ్మే దుకాణానికి వెళ్ళి, కడుపునిండా తిని, బట్టల దుకాణానికి వెళ్ళి, మంచి దుస్తులు కొను



క్కుని, వాటిని ధరించి, నగరపు వింతలు చూసి ఆనందిస్తూ, తాపీగా వీధుల వెంట నడవసాగాడు. అతనికి ఆ నగరంలో కొట్ట వచ్చినట్టు కనిపించిన వింత ఏమంటే, ఎవరిని చూసినా తెల్లదుస్తులో, నీలంరంగు దుస్తులో వేసుకున్నవారే. రంగు వేసిన దుస్తులంటూ కనబడితే అవి నీలంరంగు లోనే ఉన్నాయి. కన్ను పొడుచుకున్నా మరొక రంగు కానరాలేదు. దుకాణాలలో కూడా తెల్లబట్టలూ, నీలం బట్టలూ తప్ప మరో రంగు బట్ట లేదు. అబూ కీర్ ఒక కలంకారీ దుకాణంలోకి తొంగి చూశాడు. ఆ దుకాణంలోని తొట్టెలన్నిటి నిండా నీలం రంగే అతనికి కనబడింది.

అబూ కీర్ ఆ దుకాణంలో ప్రవేశించి, దుకాణదారుకు తన తెల్లని చేతి రుమాలు చూపి, "అయ్యా, దీనికి రంగు వెయ్యటానికి ఎంత తీసుకుంటారు? ఏ రంగు వేస్తారు?" అని అడిగాడు.

"నీలం రంగు వేస్తాను. ఇంకేమున్నది వెయ్యటానికి? ఇరవై దిరాములు తీసుకుంటాను," అన్నాడు దుకాణదారు.

"ఏమిటీ? ఈ కాస్త గుడ్డముక్కకు నీలి రంగు వెయ్యటానికి ఇరవై దిరాములా? మా దేశంలో ఇందుకు అర దిరాము పైన అడగరే!" అన్నాడు అబూ కీర్ ఆశ్చర్యాగ్రహాలతో.

"అలా అయితే మీ దేశంలోనే రంగు వేయించుకో. ఈ దేశంలో ఇరవై దిరాములకు తక్కువ ఉండదు," అన్నాడు దుకాణదారు.

"సరే, నువు అడిగినంతా ఇస్తాను. ఈ రుమాలుకు ఎర్రరంగు వెయ్యి," అన్నాడు అబూ కీర్.

"ఎర్ర రంగేమిటి? అలాటి రంగు ఎక్కడుంది?" అన్నాడు దుకాణదారు.

"పోనీ, ఆకుపచ్చరంగు వెయ్యి," అన్నాడు అబూ కీర్.

"ఆకుపచ్చరంగు మాత్రం ఎక్కడుంది? నేను దాని పేరే వినలేదు," అన్నాడు దుకాణదారు.

అబూ కీర్ తనకు తెలిసిన రంగుల పేర్లన్నీ చెప్పాడు. దుకాణదారు ఆ పేర్లు కూడా ఎరగడన్నది స్పష్టమయింది.

"పోనీ నేను చెప్పిన రంగులు వేయగల వాళ్ళు ఇంకెవరన్నా నగరంలో ఉన్నారా?" అని అబూ కీర్ అడిగాడు.

"ఈ నగరంలో కలంకారీ పని చేసే వాళ్లం నలభైమందిమి ఉన్నాము. మేమంతా ఒక సంఘంగా ఏర్పడ్డాం. మేము తప్ప ఇంకెవరూ కలంకారీ పని చెయ్యటానికి వీల్లేదు. ఈ విద్య మాకు వంశపారంపర్యంగా వస్తున్నది. దీన్ని కొత్తవాళ్ళకు చెప్పము. మేమందరమూ కూడా బట్టలకు నీలిరంగే వేస్తాం," అని దుకాణదారు అబూ కీర్‌తో అన్నాడు.

అబూ కీర్ అతనితో, "అయ్యా, నన్ను పనిలోకి తీసుకో. నేనూ కలంకారీ వాణ్ణే. ఏ రంగు కావాలంటే ఆ రంగు బట్టలకు వేసే కిటుకు నీకు చెబుతాను. నువు మిగిలిన కలంకారీ వాళ్ళందరినీ అవలీలగా మించిపోయి, పైకి రాగలుగుతావు," అన్నాడు.

"మేము పైవాళ్ళను పనిలోకి తీసుకోము," అన్నాడు దుకాణదారు.

"అలా అయితే, నేను సొంతాన కలంకారీ దుకాణం పెడితే ఏమవుతుంది?" అన్నాడు అబూ కీర్.



"అది అసంభవం! నీ వల్లకాదు!" అన్నాడు దుకాణదారు.

అబూ కీర్ ఇంకేమీ అనక ఆ దుకాణం వదిలిపెట్టి, మరి కొన్ని కలంకారీ దుకాణాలు తిరిగాడు. ఎక్కడికి పోయినా ఎవరూ అతన్ని పనిలో పెట్టుకోవటానికి ఒప్పుకోలేదు. చివరకు అతను కలంకారీ సంఘం పెద్ద వద్దకు వెళ్ళాడు.

"నేను మాత్రం ఏం చెయ్యగలను? పైవాళ్ళను మా వృత్తిలో చేర్చుకోవటం ఆచారానికీ, ఆచరణకూ విరుద్ధం," అన్నాడు కలంకారీ వాళ్ళ పెద్ద.

అబూ కీర్‌కు కడుపు మండిపోయింది. అతను తిన్నగా ఆ దేశపురాజు వద్దకు వెళ్ళి,



దుకాణం పెట్టిస్తాను. నగరంలోని కలంకారీ వాళ్ళ గొడవ నీకేమీ వద్దు. వారిలో ఎవడన్నా నీ జోలికి వచ్చాడో వాణ్ణి వాడి దుకాణం వాకిటనే ఉరి తీయిస్తాను," అన్నాడు.

ఆయన తన ఆస్థాన వాస్తుప్రవీణులను పిలిచి , "మీరు ఈయన వెంట వెళ్ళి, ఆయన ఎన్నుకున్న ప్రదేశంలో ఎలాంటి భవనంగాని, తోటగాని ఉన్నా సరే దాన్ని నేలమట్టం చేసి, అక్కడ ఒక కలంకారీ కార్ఖానా నిర్మించండి. అందులో నలభై పెద్ద తొట్టెలూ, నలభై చిన్న తొట్టెలూ ఉంచడానికి అవకాశం ఉండాలి. ఈయన ఏమి చెబితే అది అక్షరాలా చెయ్యండి," అన్నాడు.

తరవాత రాజుగారు అబూ కీర్‌ను దుశ్శాలవలతో సత్కరించి, వెయ్యి దీనారాలను, ఇద్దరు కుర్రవాళ్ళనూ ఇచ్చి, "నీ దుకాణం తయారయేదాకా ఈ డబ్బు ఖర్చుకు ఉంచుకుని, ఈ కుర్రవాళ్ళను నౌకర్లుగా ఉపయోగించుకో," అన్నాడు. అబూ కీర్ ఉండటానికి ఒక మంచి భవంతినీ, అనేకమంది బానిసలనూ ఇచ్చాడు. అతను నగరంలో ఎక్కి తిరగటానికి మంచి గుర్రాన్ని కూడా ఇచ్చాడు.

మర్నాడు అబూ కీర్ మిలమిలా మెరిసే చెమ్కీ దుస్తులు ధరించి, గొప్ప అమీర్ లాగా గుర్రం ఎక్కి ఊరి మీద బయలు

"మహారాజా, నేను పరదేశీవాణ్ణి. నాది కలంకారీ వృత్తి. నేను బట్టలకు వేసిన రంగు వెయ్యకుండా నలభై రంగులు వెయ్యగలను. అయినప్పటికీ తమ నగరంలోని కలంకారీ వాళ్ళు నాకు తమ వృత్తిలో చోటు లేకుండా చేస్తున్నారు. వారికేమో నీలంరంగు తప్ప మరొక రంగే తెలీదు. నేను ఏ బట్టకైనా సరే ఎన్నో రకాల ఎరుపూ, పసుపూ, ఆకుపచ్చా వేయగలను," అంటూ తన గోడు చెప్పుకున్నాడు.

అబూ కీర్ చెప్పే రంగుల జాబితా విని రాజు దిగ్భ్రమచెంది, "నువు నిజంగా బట్టలకు అన్ని రంగులు వేయాలి గాని, నీకు కావలిసినంత డబ్బు నేనే ఇచ్చి, కలంకారీ

దేరాడు. అతని నౌకరు కుర్రాళ్ళూ, వాస్తు ప్రవీణులూ అతని ముందు నడిచారు. అబూ కీర్ వీధులన్నీ తిరిగి, చివరకు పర్త కుల పేట మధ్య గల ఒక పెద్ద దుకాణాన్ని ఎన్నుకున్నాడు. వెంటనే రాజుగారి మనుషులు దుకాణం గలవాళ్లని అక్కడినుంచి వెళ్ళ గొట్టి, ఒక చెంపనుంచి ఇంటిని పడగొట్టుతూ, కొత్త భవనం కట్టుకురాసాగారు. అబూ కీర్ గుర్రంమీద కూర్చునే, "ఇక్కడ ఇలా కట్టండి. అక్కడ అలా కట్టండి," అని కట్టేవాళ్ళను హెచ్చరించాడు. త్వరలోనే, ప్రపంచంలో మరెక్కడా లేని కలంకారీ కార్ఖానా తయారయింది.

రాజుగారు అబూ కీర్‌ను పిలిపించి, "ఇక నువ్వు పని ప్రారంభించు. అందుకు నీకు డబ్బు కావలసి ఉంటుంది. ప్రస్తుతానికి ఈ అయిదువేల దీనారాలు తీసుకో. నీ కలం కారీ పనితనం చూడాలని నేను ఆత్రంగా ఉన్న సంగతి గుర్తుంచుకో," అన్నాడు.

అబూ కీర్ రాజుగారిచ్చిన డబ్బంతా తన ఇంట్లో దాచి, కొద్ది చిల్లర డబ్బులతో తనకు కావలసిన మందులను దుకాణాలలో కారు చౌకగా కొని, తొట్టెలన్నిటి నిండా రంగులు కలిపి పెట్టాడు.

రాజుగారు అతని వద్దకు నూలువీ, పట్టువీ, ఉన్నివీ అయిదు వందల తానులు పంపాడు. అబూ కీర్ కొన్నిటికి ప్రత్యేకమైన రంగులూ, మరికొన్నిటికి రంగుల మిశ్రమాలూ వేసి, ఏ రెండు గుడ్డముక్కలూ ఒకరంగులో కనిపించకుండా చూసి, తన



కార్ఖానా బయట వీధి పొడుగునా ఆరగట్టాడు. ఎండలో అవి ఎంతో చూడముచ్చటగా ఉన్నాయి.

ఈ దృశ్యం చూడటానికి నగరవాసులు తండోపతండాలుగా వచ్చారు. వర్తకులు తమ దుకాణాలను మూసి మరీ వచ్చారు. పిల్లలూ, ఆడవాళ్ళూ ఆ రంగురంగుల బట్టలు చూసి ఆనందోద్రేకం చెంది కేకలు పెట్టారు. అనేకమంది అబూ కీర్‌ను వేరు వేరు రంగుల పేర్లు అడిగి చెప్పించుకున్నారు.

జనం చేసే కోలాహలం ముమ్మరంగా ఉండగా రాజుగారే స్వయంగా అక్కడికి వచ్చాడు. ఎండలో నయనానందకరంగా కనిపించే రంగుల తోరణాన్ని చూసి ఆయన తన్మయత్వంలో చాలాసేపు కొయ్యబొమ్మ లాగా నిలిచిపోయాడు.

ఇంత నేర్పరి అయిన కలంకారీ నిపుణుడికి తగిన మర్యాద ఎలా చేయాలో రాజు గారికి తెలియలేదు. ఆయన తన షజీరును అతని గుర్రం మీది నుంచి దిగమని, దాని మీద అబూ కీర్‌ను కూర్చోబెట్టాడు. తరవాత ఆయన రంగుబట్టలన్నిటినీ కట్టించుకుని, అబూ కీర్‌ను వెంటబెట్టుకుని తన భవనానికి వెళ్ళి, అబూ కీర్‌కు బంగారమూ, విశేషాధికారాలూ ఇచ్చి గౌరవించి పంపేశాడు. తరవాత ఆయన రంగుబట్టలతో తనకూ, తన భార్యలకూ, రాజభవనంలోని ఉద్యోగులకూ దుస్తులు తయారు చేయించి, మరొక వెయ్యితానులను రంగు వెయ్యటానికి కలంకారీ కార్ఖానాకు పంపాడు.

కొద్దికాలం గడిచేసరికి నగరంలో గొప్పవారంతా రంగు రంగుల ఉడుపులు ధరిస్తూ కనబడ్డారు. ఆస్థాన కలంకారీవాడైన అబూ కీర్ నగరానికంతటికీ గొప్ప ధనవంతుడయాడు. నగరంలోని కలంకారీ పనివాళ్ళు నలభైమందీ అతని వద్దకు వచ్చి, క్షమాపణలు చెప్పుకుని, తమను జీతంలేకుండా పని నేర్చుకునే వాళ్ళుగా పెట్టుకోమని అతన్ని ప్రార్థించారు. అతను వారందరినీ అవమానించి పంపేశాడు. కాలక్రమాన నగరమంతటా రంగు రంగుల దుస్తులు కనిపించాయి. —(ఇంకావుంది)






# 3

కలంకారీవాడు తన సొత్తు కాజేసి తనను విడిచిపెట్టిపోయాక, అబూ సీర్ మూడు రోజులపాటు స్పృహ లేకుండా పడి ఉన్నాడు. ఈ మూడు రోజులూ కూడా ఎవరూ గది నుంచి బయటికి రాలేదు, గదిలోకి పోలేదు అది గమనించి సత్రం దర్వాను, "వీళ్ళు డబ్బు ఇవ్వకుండా పారిపోలేదుగద? లేక ఇద్దరూ చచ్చి పోయారా?" అనుకుని, గది తలుపు తోసి, గదిలోకి వచ్చి, పాలిపోయి చావటానికి సిద్ధంగా ఉన్నట్టున్న మంగలి అబూ సీర్‌ను చూశాడు. అబూ సీర్ మూలుగుతున్నాడు.

"అన్నా, నీకేం వచ్చింది? రెండోవాడు ఎక్కడ?" అని దర్వాను అబూసీర్‌ను అడిగాడు.

"నాకేం వచ్చిందో అల్లాకే తెలియాలి. నాకిప్పుడే స్పృహ తెలిసింది. ఎంత కాలంగా పడి ఉన్నానో ఏమో తెలీదు. చాలా దాహంగా ఉంది. నా డబ్బు సంచీలో నుంచి డబ్బులు తీసుకుని నా కేమన్నా తెచ్చి పెట్టు," అన్నాడు అబూ సీర్ బలహీనంగా.

దర్వాను సంచీని గాలించి చూసినా అందులో ఏమీలేదు. మంగలివాణ్ణి రెండో వాడు దోచాడని అర్థం చేసుకుని దర్వాను, "నీ తిండి విషయం బెంగ పెట్టుకోకు. నిన్ను నేను చూసుకుంటాను." అని, ఇంత జావ కాచి తెచ్చి, తానే అబూ సీర్ చేత తాగించి, కంబళి కప్పాడు.

అలా ఆ పుణ్యాత్ముడు రెండు నెలల పాటు తన సొంత డబ్బు ఖర్చు చేసి, అబూ సీర్‌ను సంరక్షించాడు.

చివరకు దైవానుగ్రహం వల్ల అబూ సీర్ కోలుకుని, లేచి కూర్చున్నాడు.

---

అరేబియన్ కథ

---



"అల్లా అనుగ్రహం ఉండాలేగాని, నువు నాకు చేసిన మహోపకారానికి తగిన ప్రత్యుపకారం చేస్తాను. కాని నీ ఋణం పూర్తిగా తీర్చగలవాడు ఆ భగవంతుడు ఒక్కడే!" అన్నాడు అబూ సీర్ సత్రం దర్వానుతో.

"నువు బతికి బయట పడటమే అల్లా అనుగ్రహం అనుకో," అన్నాడు దర్వాను.

అబూ సీర్ తన మంగలి పొది తీసుకుని నగరంలోకి బయలుదేరాడు. అతను అనుకోకుండా అబూ కీర్ నడిపే కలంకారీ కార్ఖానా వద్దకే వచ్చాడు. అక్కడ ఆరగట్టి ఉన్న రంగురంగుల బట్టలను వింతగా చూస్తూ చాలా పెద్ద గుంపు చేరి ఉన్నది.

"ఇంతమంది ఇక్కడ చేరారు, కారణం ఏమిటి?" అని అబూ సీర్ అక్కడ ఉన్న వాళ్ళను అడిగాడు.

"ఇది ఆస్థాన కలంకారీ నిపుణుడు అబూ కీర్ దొరగారి కార్ఖానా. ఇక్కడ ఆయన ఎవరికీ తెలియని రహస్యప్రయోగాలు చేసి బట్టలకు ఈ వింత రంగులన్నీ వేస్తాడు." అన్నాడు ఒక మనిషి.

తన మిత్రుడు బాగుపడ్డాడని తెలిసి అబూ సీర్ హృదయం పొంగి పోయింది. "దేవుడి అనుగ్రహం ఉండి అతను పైకి వచ్చాడు. నేను అతన్ని గురించి చెడుగా అనుకున్నది తప్పు. పని తొందర వల్లనే అతను నన్ను వదిలిపెట్టి పోవటమూ, మరిచి పోవటమూ జరిగి ఉంటుంది. నా డబ్బు తీసుకుపోవటం కూడా రంగులు కొనటానికే అయి ఉంటుంది. అతను నన్ను చూసి పరమానందం చెంది, నేను చేసిన సహాయానికి పదింతలు సహాయం చేస్తాడు." అనుకున్నాడు అబూ సీర్.

అతను గుంపు మధ్యగా దారి చేసుకుంటూ వెళ్ళి, కార్ఖానా తలుపు తోసి లోపలికి చూశాడు. అబూ కీర్ ఒక ఎత్తయిన మంచం మీద బాలీసుల పైన బద్ధకంగా పడుకుని ఉన్నాడు. అతను ధరించిన దుస్తులు రాజులు ధరించదగినవిగా ఉన్నాయి. అతని వెనకగా నలుగురు నల్ల

బానిసలూ, నలుగురు తెల్లబానిసలూ మంచి దుస్తులు ధరించి నిలబడి ఉన్నారు. ఇద్దరు పనివాళ్ళు తొట్టెల వద్ద పని చేస్తున్నారు. వాళ్ళు ఏమి చెయ్యవలసినదీ అబూ కీర్ సంజ్ఞల ద్వారా చెబుతున్నాడు.

అబూ సీర్ లోపలికి వెళ్ళి తన మిత్రుడి ఎదట నిలబడి, అతను తనకేసి చూసి నవ్వుడు పలకరిద్దామనుకున్నాడు; తనను చూస్తూనే అతను వచ్చి కౌగలించుకుంటా డనుకున్నాడు.

కాని, అబూ కీర్ అబూ సీర్‌ను చూస్తూనే, చివాలున లేచి, "దొంగ వెధవా! నా దుకాణం ఛాయలకు రావద్దని ఎన్నిసార్లు చెప్పాను? నన్ను సర్వనాశనం చేసి, అప ఖ్యాతి తీసుకు రాదలచావా? ఒరే, వాణ్ణి పట్టుకోండి!" అని అరిచాడు.

వెంటనే తెల్ల బానిసలూ, నల్ల బానిసలూ అబూ సీర్‌ను పట్టుకుని, పడదోసి, మీద ఎక్కి తొక్కారు. అబూ కీర్ దుడ్డుకర్ర తీసుకుని, "వాణ్ణి బోర్లా పడుకోబెట్టండి," అన్నాడు. అబూ సీర్ వీపుమీద నూరు దెబ్బలు కొట్టి, వెల్లికిలా తిప్పించి, పొట్ట మీద మరో నూరు దెబ్బలు కొట్టి, "పో, మాయదారి ముండాకొడకా! ఈసారి నీ ముఖం చూపిం చావంటే నిన్ను రాజుగారి వద్దకు పంపి, నీ చర్మం ఒలిపించి, కోటబయట కొరత వేయిస్తాను! పాపిష్టి ముఖమా!" అన్నాడు.



శరీరమూ, మనస్సూ కూడా గాయపడి, బాధతో ఏడుస్తూ అబూ సీర్ కాళ్ళీడ్చు కుంటూ బయటికి వెళ్ళాడు. బయట మూగిన జనం అతన్ని నానా తిట్లూ తిట్టారు.

అతను తన గదికి తిరిగి వచ్చి, చాప మీద పడుకుని, అబూ కీర్ దుష్ప్రవర్తన గురించి తెల్లవార్లూ ఆలోచించాడు. మర్నాడు ఉదయానికి దెబ్బల బాధ కాస్త తగ్గింది. అతను లేచి స్నానశాలకు బయలుదేరాడు.

అతను వీధిలోకి వచ్చి, దారేపోయే వాణ్ణి, "స్నానశాలకు దారి ఎటు, బాబూ?" అని అడిగాడు.

"స్నానశాల అంటే ఏమిటి?" అని ఆ మనిషి ఎదురు అడిగాడు.

"స్నానం చేసి, వంటి మురికి వదిలించుకునే చోటు. ప్రపంచంలో అంతకన్న సుఖప్రదమైన చోటు ఉండదుగద," అన్నాడు అబూ సీర్.

"వెళ్ళి, సముద్రంలో స్నానం చెయ్యి. అందరూ అక్కడే స్నానం చేస్తారు," అన్నాడు ఆ మనిషి.

ఆ నగరంలో వాళ్ళకు స్నానశాల సౌకర్యాలు ఏమిటో తెలియదని అబూ సీర్ త్వరలోనే గ్రహించగలిగాడు.

అతను తిన్నగా రాజభవనానికి వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, నేను పరదేశిని. వృత్తిచేత మంగలిని. కాని నాకు ఇతర విద్యలు తెలుసు. నీరు కాస్తాను. ఒళ్ళు పట్టుతాను. ఇవాళ నేను తమ నగరంలో స్నానశాలకు వెళదామనుకుంటే, ఎవరికి స్నానశాల అనేమాటే తెలియలేదు. ఇంత మహానగరానికి స్నానశాల లేకపోవటం ఆశ్చర్యకరం. అది భూలోకస్వర్గం అన్నమాట," అన్నాడు.

"నువు చెప్పే ఈ స్నానశాల ఎటువంటిది? నేనా పేరైనా ఎన్నడూ వినలేదే!" అన్నాడు రాజు.

స్నానశాల నిర్మాణం ఎలా ఉంటుందో, అందులో స్నానాలు చేసేవారికి ఏయే సదుపాయాలు ఉంటాయో, అబూ సీర్ వివరంగా రాజుగారికి చెప్పాడు. అంతా చెప్పి, "మహారాజా, ఈ విషయాలు అనుభవించవలసినవి గాని, వర్ణించేవి కావు. వర్ణిస్తే అర్థమయేవి కూడా కావు. స్నానశాలే ఉంటే



ఈ నగరానికి వంక పెట్టటానికి ఉండదు," అన్నాడు.

ఈ మాట విని రాజుగారికి మహదానందమయింది.

"ఏ తల్లి కన్నవాడివో, నీకు స్వాగతం," అంటూ ఆయన అబూ సీర్‌కు తన చేత్తో శాలువ కప్పి, "నువు ఎలా చెయ్యమంటే అలా జరిపిస్తాను. నువు మాత్రం త్వరలోనే స్నానశాల నిర్మించు. నాకు దాని ఆనందం అనుభవించాలని ఉన్నది," అన్నాడు.

ఆయన అబూ సీర్‌కు ఇద్దరు నీగ్రోలనూ, ఇద్దరు కుర్రవాళ్ళనూ, నలుగురు యువతులనూ, ఒక గుర్రాన్ని, ఒక దివ్యమైన భవంతినీ ఇప్పించాడు. కలంకారీవాడికిచ్చిన సౌకర్యాలకన్న ఎక్కువే అబూ సీర్‌కు లభించాయి. అబూ సీర్ నిర్ణయించిన చోట స్నానశాల కట్టటానికి ఆస్థానంలోని తాపీవాళ్ళూ, తదితరులూ నియోగించబడ్డారు. వారిని వెంటబెట్టుకుని అబూ సీర్ నగరమంతా తిరిగి, తగిన చోటు నిర్ణయించాడు. అక్కడ అతని పర్యవేక్షణ కింద, ప్రపంచంలో ఎక్కడా లేనటువంటి అద్భుత స్నానశాల నిర్మాణమయింది. స్నానశాల అంతటా అందమైన నగిషీలూ, రంగు రంగుల పాలరాతి పలకల గళ్ళూ అమర్చారు.

స్నానశాల నిర్మాణం పూర్తికాగానే అబూ సీర్ రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, స్నానశాల తయారయింది. సరంజామా ఏర్పాటు మాత్రమే మిగిలి ఉన్నది," అన్నాడు.





రాజు అందుకుగాను పది వేల దీనారాలు మంజూరు చేశాడు. అబూ సీర్ ఆ డబ్బుతో తువాళ్లూ, వస్త్రాలూ, సిల్కులూ, అత్తరులూ, సుగంధద్రవ్యాలూ, మొదలైనవి కొని, ఎక్కడ అమర్చవలసినవి అక్కడ అమర్చాడు.

అబూ సీర్ ఈ ఏర్పాట్లు పూర్తిచేసి రాజు వద్దకు వెళ్ళి, బలిష్ఠులైన పదిమంది మనుషులను ఒళ్ళు పట్టటానికి ఇవ్వమన్నాడు. రాజుగారు ఇరవై మంది కండలు తిరిగిన యువకులను ఇచ్చాడు. అబూ సీర్ వాళ్లకు ఒళ్ళు పట్టటం ఎలాగో, స్నానం చేయించటం ఎలాగో తాను వారికి చేసి చూపి, తాను వారిచేత చేయించుకుని, ఆ విధంగా వారిని తరిఫీదు చేశాడు.

అబూ సీర్ స్నానశాలను ప్రారంభించటానికి ఒక .రోజు నిర్ణయించి, ఆ విషయం రాజుగారికి విన్నవించాడు.

ఆ రోజున అబూ సీర్ స్నానశాల నిండా సుగంధమూ, ధూపాలూ వేసి, నీరు కాచి, కొలనులలో నీటి కొళాయిలు తిప్పి సిద్ధంగా ఉంచాడు. స్నానశాల అంతా కడిగిన ముత్యంలాగా ఉన్నది. రాజుగారు తన మంత్రులతోనూ, పరివారంతోనూ స్నానశాలలోకి అడుగు పెడుతూనే తన్మయత్వం చెందాడు. సువాసనలూ, సుందర నిర్మాణమూ, కొళాయిలలో నీరు చేసే ధ్వనులూ ఆయనను ముగ్ధుణ్ణి చేశాయి.

"ఏమిటిదంతా?" అన్నాడాయన.

"ఇదే స్నానశాల, మహారాజా! కాని తమరింకా ద్వారం దగ్గిరే ఉన్నారు," అంటూ అబూ సీర్ ఆయనను మొదటి హాలులోకి తీసుకుపోయి, దిమ్మె మీదికి ఎక్కించి, ఆయన బట్టలు విప్పి, తువాలు చుట్టి, ఆయన కాళ్ళకు కొయ్యచెప్పులు తొడిగి, ఆయనను రెండో హాలులోకి తీసుకుపోయాడు. అక్కడ రాజుగారికి చెమట పట్టించి, శరీరమంతా యువకులచేత బలంగా రుద్దించాడు. తరవాత ఆయన శరీరమంతా కడిగి, ఆయనను కొలనులోని పన్నీటిలో కొంతసేపు ఉండనిచ్చి, తరవాత శరీరానికి జాజిఅత్తరూ, ఇతర అత్తరులూ

పట్టించి, ఒంటికంతకూ ముసాంబరం, సాంబ్రాణి ధూపాలు వేశారు.

రాజుగారికి తన ఒళ్ళు గాలిలో తేలిపోగల దన్నంత తేలిక అయినట్టు తోచింది. చర్మం నున్నగా, గచ్చులాగున్నది. ఆయనకు ఎక్కడలేని జవసత్వాలూ వచ్చినట్టు అనిపించింది.

"యా అల్లా! ఇటువంటి అనుభవం ఎన్నడూ ఎరగను. ఇదా స్నానశాల అంటే?" అన్నాడు రాజు.

"అవును, మహారాజా!" అన్నాడు అబూ సీర్.

"నా నగరం ఈనాడు నిజంగా నగరం అనిపించుకున్నది," అన్నాడాయన.

"ఈ స్నానం విలవ ఎంత అంటావు? నువు ఎంత అడుగుదామనుకుంటున్నావు?" అని రాజుగారు అబూ సీర్‌ను అడిగాడు.

"తమ దయ," అన్నాడు అబూ సీర్.

"అలా అయితే ఈ స్నానం విలవ వెయ్యి దీనారాలు అంటాను. అంతకన్న తగ్గటానికి వీల్లేదు," అన్నాడు రాజుగారు. ఆయన అబూ సీర్ చేతిలో వెయ్యిదీనారాలు పెడుతూ, "ఇంతకన్న తక్కువ మొత్తానికి ఎవరికీ స్నానం చేయించకు," అన్నాడు.

"క్షమించండి, మహారాజా. ధనికులుంటారు, పేదలుంటారు. ప్రతి ఒకడూ వెయ్యి దీనారా లివ్వాలని నియమం పెడితే



త్వరలోనే ఈ స్నానశాలను మూయవలిసి వస్తుంది," అన్నాడు అబూ సీర్.

"అయితే నువు ఎంత ఏర్పాటు చేస్తానంటావు?" అని రాజు అడిగాడు.

"ఎవరి తాహతుకు తగ్గట్టు వారు ఇస్తారు. వెయ్యి దీనారా లంటే అది మహారాజులు ఇవ్వతగినది," అన్నాడు అబూసీర్.

అతని అభిప్రాయానికి రాజు వెంట వచ్చిన వారందరూ హర్షించారు.

"అతను చెప్పినది సబబుగా ఉన్నది, మహారాజా. అందరికీ తమలాంటి ఈవి ఎలా వస్తుంది?" అన్నారు వాళ్ళు రాజుతో.

"అదంతా నిజమే కావచ్చు. ఏమైనా, ఇతను ఎక్కడినుంచో వచ్చిన పేదవాడు.

ఇతన్ని సంపన్నుణ్ణి చెయ్యటం మన ధర్మం. మన నగరానికి ఈ అద్భుతమైన స్నానశాల ఇచ్చాడు. మీరందరూ ఒక్కొక్క స్నానానికి వెయ్యేసి దీనారాలు ఇవ్వలేని పక్షంలో ఈసారికి నూరేసి ఇస్తూ, ఒకరిద్దరు బానిస లను కూడా ఇవ్వండి. తరవాత, అతను కోరినట్టు, మీమీ శక్తికొద్దీ ఇద్దురుగాని," అన్నాడు రాజు.

రాజుగారి వెంట నలభైమంది వచ్చారు. వారందరూ స్నానాలు చేసినాక అబూ సీర్ నాలుగు వేల దీనారాలనూ, నలభై తెల్లా బానిసలనూ, నలభై నీగ్రో బానిసలనూ, నలభై మంది స్త్రీలనూ సంపాదించు కున్నాడు. రాజుగారు ప్రత్యేకంగా పది వేల దీనారాలనూ, పది మంది తెల్ల బానిసలనూ, పదిమంది నీగ్రోలనూ, పదిమంది స్త్రీలనూ బహూకరించాడు.

అబూ సీర్ రాజుగారికి కృతజ్ఞతా పూర్వ కంగా నమస్కరించి, "మహారాజా, ఈ బానిసలనూ, ఆడవాళ్ళనూ ఎక్కడ ఉంచను?" అన్నాడు.

"నిన్ను సంపన్నుణ్ణి చెయ్యటానికి ఈ పరిచారకులను ఇప్పించాను. నువు రేపు మీ దేశానికి తిరిగి పోయినప్పుడు వీళ్ళు నీకు సేవలు చేస్తారు. వీళ్ళు నీ సంపద," అన్నాడు రాజు.

"మహారాజా, ఇంతమంది సేవకులు తమవంటి ప్రభువులకు చెల్లుతుందిగాని, నాకు పరిచారకులు అవసరం లేదు. మాది సాదా సంసారం. నేను వీరికి తిండీ, బట్టా ఎక్కడి నుంచి తెచ్చేది?" అన్నాడు అబూ సీర్.

రాజు విరగబడి నవ్వి, "అది నిజమే," అన్నాడు. ఆయన ఆ బానిసలందరినీ తలకు నూరేసి దీనారా లిచ్చి తానే కొనుక్కున్నాడు. ఖజానాదారు నూటయాభై మంది బానిసలకూ డబ్బు చెల్లించాడు.

రాజుగారు పరివారంతో సహా వెళ్ళి పోయాక, ధనమంతా తన ఇంటికి తీసుకు పోయి, దీనారా లన్నిటినీ సంచులలో నింపి కుట్టేసి, ఆ సంచులను భద్రంగా దాచు కున్నాడు అబూ సీర్. —(ఇంకా వుంది)





# అబూ కీర్ సీర్

## 4

మర్నాడు అబూ సీర్ నగరమంతటా చాటింపు వేయించి, నగరవాసులందరూ రాజుగారి స్నానశాలలో స్నానాలు చేయ వచ్చుననీ, మూడు రోజులపాటు స్నానాలు ఉచితమనీ తెలియబరిచాడు. స్నానశాల వద్ద జనం తండోపతండాలుగా ఎగబడ్డారు. మూడు రోజులపాటు అబూ సీర్ ఎవరి వద్దా డబ్బు వసూలు చెయ్యలేదు. నాలుగో రోజు నుంచీ అతను స్నానశాల ద్వారం వద్ద హుండీ పెట్టుకుని కూర్చుని, స్నానాలు చేసి వెళ్ళిపోయేవారు ఎంత ఇస్తే అంత వసూలు చేశాడు. సాయంకాల మయేసరికి హుండీ నిండి పోయింది. ఈ విధంగా అతను కాల క్రమాన గొప్ప ధనికుడయాడు.

స్నానశాల ప్రారంభించిన కొద్ది రోజులకే రాణీగారు, తన భర్త స్నాన సౌకర్యాలను తెగ మెచ్చుకోవటం చూసి తాను కూడా అక్కడికి వెళ్ళి స్నానం చేయ నిశ్చయించింది. ఈ వార్త అందగానే అబూ సీర్ స్నానశాలలో ఉదయం పూట పురుషులూ, సాయంకాలం పూట స్త్రీలూ స్నానాలు చేయటానికి ఏర్పాటు చేశాడు. స్త్రీలు ఇచ్చే డబ్బు వసూలు చెయ్యటానికి గాను అతను నగరంలోని ఒక మర్యాదస్తురాలైన స్త్రీని ఏర్పాటు చేశాడు.

రాణీగారు ఒకసారి స్నానం చేసి అందులోని సుఖం అనుభవించిన మీదట, ప్రతి శుక్రవారం సాయంకాలమూ వచ్చి అక్కడ స్నానం చేయ నిర్ణయించింది. రాజుగారు ప్రతి శుక్రవారం ఉదయమూ వచ్చి వెయ్యి దీనారాలు ఇచ్చినట్టే, రాణీగారు కూడా ప్రతి శుక్రవారం సాయంకాలమూ వచ్చి స్నానం చేసి వెయ్యిదీనారాలు ఇస్తూ వచ్చింది.



అబూ సీర్ సంపదా, గౌరవమూ, కీర్తి అపారంగా పెరిగి పోతున్నాయి. కాని అతను పూర్వంలాగే వినయ విశ్వాసాలు కలిగి ఉన్నాడు. అతని మనసు ఏమీ మారలేదు; ఎప్పుడూ ఆనందంగా ఉండేవాడు. అతని సౌజన్యమూ, పేదలంటే దయా అలాగే ఉన్నాయి. బీదవాళ్ళ దగ్గిర ఎన్నడూ డబ్బు పుచ్చుకోడు. అతని మంచితనమే చివరకు అతన్ని కాపాడింది. అది ఎలా జరిగినదీ ముందు ముందు తెలుస్తుంది.

అబూ సీర్ నడుపుతున్న స్నానశాలను గురించి కలంకారీవాడు అబూ కీర్ కూడా విన్నాడు. ఎందుకంటే, దాన్ని భూలోక స్వర్గంగా నగరవాసులందరూ చెప్పుకుంటు న్నారు. తాను కూడా స్నాన సౌఖ్యం అనుభ వించాలనుకుని అబూ కీర్ మేలి దుస్తులు ధరించి, తన కంచరగాడిద మీద ఎక్కి, సపరివారంగా స్నానశాలకు బయలుదేరాడు. అతనికి ముందూ, వెనకా కూడా బానిసలు బెత్తాలు పట్టుకుని నడిచారు.

స్నానశాలలోకి అడుగు పెట్టగానే అగరు చందనం వాసనలు గుప్పున తగిలాయి. అంతులేని జనం లోపలికి పోతున్నారు, బయటికి వస్తున్నారు. అతని పాత స్నేహి తుడు హుండీ దగ్గిర చిరునవ్వులు చిందిస్తూ కూర్చుని కనిపించాడు. అబూసీర్ ఇప్పుడు బాగా ఒళ్ళు చేసి ఉండటం చేత అతన్ని అబూ కీర్ చప్పున గుర్తించలేక పోయాడు. గుర్తించగానే అతనికి కలిగినది ఈర్ష్యే. అయినా అబూ కీర్ పరమానందం నటిస్తూ అబూ సీర్‌ను సమీపించి, "ఎంత పని చేశావు! స్నేహితుడూ, బుద్ధిమంతుడూ అయినవాడు చేసే పనేనా? నే నీ నగరంలో ఆస్థాన కలంకారీవాణ్ణిగా ఉంటున్న సంగతి ఎరగవా? నన్ను చూడటానికి ఎందుకు రాలేదు? నీ పాత స్నేహితుడు ఏమైనాడని విచారించనైనా విచారించావా? నేను నీ కోసం మనుషులను పంపి ఊరంతా ఎలా గాలిం చాను! నీ జాడే దొరకలేదు," అన్నాడు.

అబూ సీర్ విచారంగా తల ఆడించి, "అబూ కీర్, నేను నీ దుకాణానికి వస్తే,

నన్ను చావగొట్టి, అవమానించి, 'దొంగ, దొంగ!' అని అరిచినదంతా మరిచావా?" అని అడిగాడు.

అబూ కీర్ ఆశ్చర్యం అభినయిస్తూ, "ఏమిటి నువ్వనేది? నేను కొట్టినది నిన్నా? ఎంత ఒట్టుపడితే అంత ఒట్టు! నేను నిన్ను గుర్తించలేదు. ఒక దొంగ వెధవ నా దగ్గిర బట్టలు ఎత్తుకుపోతూ వచ్చాడు. నిన్ను చూసి వాడే అనుకున్నాను. నువు గుర్తుపట్ట రాకుండా పాలిపోయావు. అంతా అల్లా మహిమ! అయినా కొంత తప్పు నీదే. నన్ను చూడ గానే నీ పేరు చెప్పి ఉండకూడదూ? పైగా ఆ రోజు చాలా చిరాకులో ఉన్నాను. ఈ తప్పు క్షమించక తప్పదు," అన్నాడు.

"జరిగిన దేదో జరిగింది. లోపలికి వచ్చి, బట్టలు విప్పి, స్నానం చెయ్యి." అన్నాడు అబూ సీర్ అబూ కీర్‌తో.

"అయితే, అన్నా, నీకి దశ ఎలా ఎత్తుకున్నది?" అని అబూ కీర్ అడిగాడు.

"నిన్ను పైకి తెచ్చినవాడే నన్నూ పైకి తెచ్చాడు." అంటూ అబూ సీర్ తన కథ అంతా చెప్పాడు.

అబూ కీర్ అంతా విని, "రాజుగారికి నీ మీద అనుగ్రహం కలగటం ఎంత మంచిది! నా స్నేహితుడివని చెప్పానంటే రాజుగారికి నీ మీద ఉండే అభిమానం రెట్టింపు అవుతుంది," అన్నాడు.



"మనం చేసేది ఏముందిలే, నిగ్రహమూ, అనుగ్రహమూ అల్లా చేతిలో ఉన్నాయి. నువు బట్టలు తీసి స్నానం చెయ్యి," అన్నాడు అబూ సీర్. అతను తానే స్వయంగా అబూ కీర్‌కు ఒళ్ళు పట్టి స్నానం చేయించాడు; తరవాత అతనికి తాగటానికి షర్బతులు తానే ఇచ్చాడు. అబూ సీర్ అలా రాజుగారికి తప్ప మరెవ్వరికీ చెయ్యడు. అందుచేత స్నానాలు చేసే ఇతరులు కలంకారీవాడికి జరిగే మర్యాద చూసి విస్తుపోయారు.

వెళ్ళిపోతూ అబూ కీర్ డబ్బు ఇవ్వబోయాడు. కాని అబూ సీర్ నిరాకరించి, "ఇది చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది!



నాకు డబ్బు ఏమని ఇస్తున్నావు? స్నేహితుల మధ్య ఈ భేదమేమిటి?" అన్నాడు.

"సరే, నీ యిష్టం. నువు నాకు ఆదరం చూపినందుకు నేను నీ కొక సలహా ఇస్తాను. నీ స్నానశాల అన్నివిధాలా దివ్యంగా ఉన్నది గాని ఇక్కడ వెంట్రుకలు రాలిపోయే నలుగు పిండి ఒకటి లేకపోవటం పెద్ద లోపంగా ఉన్నది. అది ఎలా తయారు చేయాలంటే, ఉల్లి పాషాణమూ, నున్నమూ కలిపి నూరి, నూనెతో సుద్ద చేయాలి. అది దుర్వాసన కొట్టకుండా అందులో కస్తూరి కలపాలి. అలాటి నలుగు పెట్టావంటే రాజుగారు మితిలేని ఆనందం పొందుతాడు. ఆ నలుగుతో నలిచిన తరవాత చర్మం స్వచ్ఛంగానూ, నున్నగానూ ప్రకాశిస్తుంది," అన్నాడు అబూ కీర్.

అబూ సీర్ ఆ వివరాలన్నీ రాసుకుని అబూ కీర్‌ను పంపేశాడు.

అబూ కీర్ తిన్నగా రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, తమకు ఒక ముఖ్యమైన హెచ్చరిక చెయ్యటానికి వచ్చాను," అని ఆదుర్దాగా అన్నాడు.

"ఏమిటా హెచ్చరిక?" అని రాజుగారు అతన్ని అడిగాడు.

"అల్లా కటాక్షం ఉండబట్టి భయంకర శత్రువు ఒకడు మీకు ఇంతవరకూ ఏ కీడూ చెయ్యలేకపోయాడు. ఆ అబూ సీర్ మీ ప్రాణానికీ, రాజ్యానికీ కూడా ఎసరు పెట్టబోతున్నాడు," అన్నాడు అబూ కీర్.

"ఏం చేస్తున్నాడేమిటి?" అని. రాజు అడిగాడు.

"మహారాజా, ఈసారి తమరు స్నానశాలకు వెళ్ళటం జరిగితే అందులో నుంచి ప్రాణాలతో బయటపడటం అనుమానమే," అన్నాడు అబూ కీర్.

"ఎందుచేత?" అని రాజు అడిగాడు.

అబూ కీర్ కంపరం అభినయిస్తూ, "విషం! ఉల్లి పాషాణమూ, నున్నమూ కలిపి నూరి, అబూ సీర్ దానితో మీకు నలుగు పెట్టబోతున్నాడు. ఆ నలుగుతో ఒంటి మీది వెంట్రుకలు రాలిపోతాయనీ,

చర్మం నునుపెక్కి నిగనిగలాడుతుందని వాడు మీతో అంటాడు. కాని ఆ పిండి శరీరానికి తగలగానే భగ్గున మంట పుట్టుకొస్తుంది. అంతకన్న బాధాకరమైన చావు మరి ఉండదు. వాడు శత్రురాజుల చారుడు. తమ ప్రాణాలు తీయటానికే వాణ్ణి పంపారు. మీ ఉప్పు చాలా తిని ఉన్నాను గనక, ఈ మాట తెలియగానే తమరిని హెచ్చరించటానికి పరిగెత్తుకుంటూ వచ్చాను,'' అన్నాడు.

అబూ కీర్ చెప్పిన అబద్ధాలలో రాజుకు గురి కుదరటమే గాక, దడ కూడా పుట్టుకొచ్చింది. ఆయన అబూ కీర్‌తో, ''ఈ సంగతి రహస్యంగా ఉంచు. నే నిప్పుడే మంత్రి గారితో సహా స్నానశాలకు వెళ్ళి, నువు చెప్పినది నిజమో, కాదో తెలుసుకుంటాను,'' అన్నాడు.

రాజూ, మంత్రీ స్నానశాలకు రాగానే అబూ సీర్ రాజుగారి చేత ముందు స్నానం చేయించటానికి ఉపక్రమించాడు. కాని రాజుగారు ముందుగా మంత్రికి స్నానం చేయించమన్నాడు.

మంత్రి స్నానం ముగిసినాక అబూ సీర్ రాజుతో, ''మహారాజా, ఒక కొత్తరకం నలుగు తయారు చేశాను. అది వెంట్రుకలను సులువుగా రాల్చేస్తుంది. కత్తితో క్షౌరం చెయ్యవలిసిన పని ఉండదు.




ఈ నలుగు తమ కోసం ప్రత్యేకంగా తయారు చేశాను,'' అన్నాడు.

''ఏదీ, దాన్ని మంత్రి మీద ఉపయోగించు,'' అన్నాడు రాజు.

అబూ సీర్ తాను తయారు చేసిన పిండిని మంత్రి కాలి మీద కొద్దిగా పూశాడు. అది పూసినంత మేర వెంట్రుకలు తుప్పురాలినట్టు రాలిపోయాయి.

ఇది చూడగానే రాజుకు ఆ నలుగు గొప్ప విధ్వంసన శక్తి గల మహా విషమని నమ్మకం కలిగింది. ఆయన తన భటులతో, ''ఈ హంతకుణ్ణి పట్టుకోండి,'' అన్నాడు.

రాజూ, మంత్రీ, భటుల వెంట అబూ సీర్ రాజభవనానికి వచ్చారు. తనను భటులు

ఎందుకు పట్టుకున్నదీ అబూ సీర్‌కు అర్థం కాలేదు.

రాజు రేవు అధికారిని పిలిపించి, అతనితో, "ఈ రాజద్రోహిని తీసుకుపోయి, కాల్చిన సున్నపు రాళ్ళతో సహా గోతంలో పెట్టి కట్టి, నా కిటికీ నుంచి కనిపించేలాగా సముద్రంలో పడెయ్యి. అలా చేస్తే వీడికి నిప్పుతోనూ, నీటితోనూ చావు వస్తుంది." అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం, మహారాజా!" అని రేవు అధికారి అబూ సీర్‌ను చిన్న పడవలో ఎక్కించుకుని సముద్రం మీద బయలు దేరాడు.

ఈ రేవు అధికారి కొంత కాలం క్రితం ఓడ సరంగుగా ఉంటూ, స్నానశాలకు రాగా, అతని వద్ద డబ్బు లేదని తెలిసి, ఉచితంగా అతనికి అబూ సీర్ చక్కని స్నానం చేయించి పంపేశాడు. ఆ కృతజ్ఞత మనసులో పెట్టుకుని రేవు అధికారి అబూ సీర్‌ను తన పడవలో ఒక చిన్న లంక మీదికి తీసుకుపోయి, "బాబూ, నేను నీ ఆదరాన్ని మరవలేదు. నేను నీకు ప్రత్యుపకారం చేస్తాను. రాజు గారికి ఏ విధమైన ద్రోహం చేసి ఇలాటి భయంకరమైన మరణ దండనకు గురి అయావు? నాతో నిజం చెప్పు," అన్నాడు.

"అన్నా, దేవుడు సాక్షిగా నేను ఏ విధమైన నేరమూ చేయలేదు. నాకీ శిక్ష ఎందుకు విధించారో తెలియదు," అన్నాడు అబూ సీర్.

"అలా అయితే నీ విరోధులెవరో నీ మీద రాజుగారికి అబద్ధాలు చెప్పి ఉంటారు.



బాగుపడుతున్న వాడికి విరోధులకేం కొదవ? కాని ఈ లంక మీద ఉండిపో. నీకు ఎలాటి అపాయమూ కలగదు. చేపలు పట్టుతూ కూర్చున్నావంటే నీకు కాలక్షేపం అవుతుంది. ఈ లోపుగా నిన్ను మీ దేశానికి పంపే మార్గం ఏదో ఒకటి చూస్తాను,'' అన్నాడు రేవు అధికారి.

అతను ఒక సంచీలో కాల్చిన సున్నపు రాళ్ళు నింపుకుని పడవలో సముద్రం మీద వెళ్ళి, రాజ భవనపు కిటికీలకు ఎదురుగా పడవను ఆపి, రాజుగారు చెయ్యి ఊపి సంజ్ఞ చెయ్యగానే గోతాన్ని సముద్రంలోకి తోసేశాడు.

అయితే రాజుగారు చెయ్యి ఊపేటప్పుడు రాజుగారి వేలికి ఉన్న ఉంగరం జారి నీటిలో పడిపోయింది. అది అద్భుత శక్తులు గల ఉంగరమనీ, దాని మహిమ వల్ల, రాజుగారిని ఎదిరించిన వాళ్ళు భస్మమైపోతారనీ ఆ దేశంలోని ప్రజల నమ్మకం. అది పోయిందని తెలిస్తే ప్రజలకు రాజుగారి మీద ఉన్న గురి కాస్తా పోతుంది. అందుచేత రాజు తన ఉంగరం సముద్రంలో పడిపోయిన సంగతి మరొక ప్రాణికి తెలియనివ్వక అతి రహస్యంగా ఉంచాడు.

లంక మీద ఒంటరిగా దిగబడిపోయిన అబూ సీర్, రేవు అధికారి ఇచ్చిన వల తీసుకుని చేపలు పట్టటానికి బయలుదేరాడు. అతనికి అందువల్ల పొట్ట గడవటమే గాక, బాధ కలిగించే ఆలోచనలు రాకుండా చూసుకోవచ్చు.






అబూ సీర్ వల వెయ్యగానే అందులో పెద్ద, చిన్న చేపలు, రంగు రంగువి చాలా పడ్డాయి. చేపల కూర తిని చాలా కాల మయిందని అబూ సీర్‌కు గుర్తు వచ్చింది. ఆ చేపలను రేవు అధికారి కిచ్చి వండించి, తాను కూడా చేప కూర తిందామనుకున్నాడు అబూ సీర్.

ఏమంటే, రోజూ సముద్రంలో చేపలు పట్టి, ఇద్దరు వంటవాళ్ళ చేత వాటిని వండించి, రాజుగారికి పంపే పని రేవు అధి కారిదే. ఈ రోజు పని పడబట్టి గాని, లేక పోతే ఆ వలతో రేవు అధికారే చేపలు పట్టి ఉండేవాడు. ఈ రోజు అబూ సీర్ వల వేసింది రేవు అధికారి తరఫునే.

వలలో పడిన చేపలలో పెద్దదాన్ని ఏరి, దాన్ని తన కోసం వండించుకుందామను కుని, అబూ సీర్ తన చాకు పైకి తీసి ఆ చేపను కోశాడు. అతను చాకు పైకి తీసే సరికి దాని మొనకు చిక్కుకుని ఒక బంగా రపు ఉంగరం కనిపించింది. అది రాజు గారు పోగొట్టుకున్న ఉంగరమే. ఆ సంగతి తెలియక అబూ సీర్ పరధ్యానంగా తన వేలికి పెట్టుకున్నాడు.

కొంతసేపు అయాక రేవు అధికారి తిరిగి వచ్చి, అబూ సీర్ చేతిన ఉన్న ఉంగరం చూసి నిర్ఘాంతపోయి, అది అబూ సీర్‌కు ఎలా దొరికినదీ విన్నాక, "ఎవరి విధి ఎలా ఉన్నదీ చెప్పలేం గద! నువు ఆ ఉంగరంతో రాజుగారి ఎదట పడవచ్చు. నిన్ను ఎవరూ అడ్డలేరు. రాజుగారు కూడా నీ ముందు పిల్లి అయిపోతాడు!" అన్నాడు.

అబూ సీర్ రాజభవనానికి వెళ్ళాడు. రాజుగారు దర్బారులో ఉన్నాడు. ఆయన అబూ సీర్‌ను చూసి, "నా యెదట సము ద్రంలో చచ్చిపోతివే, ఎలా బతికి వచ్చావు?" అని అడిగాడు.

అబూ సీర్ తనకు మరణదండన జరగ కుండా రేవు అధికారి ఎలా కాపాడినదీ, తనకు ఉంగరం ఎలా దొరికినదీ రాజుగారితో చెప్పి, "తమరు నాకు చూపిన అనుగ్రహం అంతులేనిది. అందుచేత తమకు

ఈ ఉంగరం ఇవ్వటానికి వచ్చాను. నేను నేరస్థుణ్ణి కాను; అయితే తిరిగి మీ ఎదటికి రాను. నా మీద ఏ నేరం ఆరోపించి నాకు దారుణమైన మరణ దండన విధించారో తెలపమని కోరుతున్నాను," అన్నాడు.

రాజు ఉంగరం తీసుకుని తన వేలికి పెట్టుకోగానే ఆయనకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆయన అబూ సీర్‌ను ఆలింగనం చేసుకుని, "నా క్రూరత్వాన్ని మరిచిపో. మరొకడైతే నా ఉంగరాన్ని నాకు తిరిగి ఇచ్చి ఉండడు. నీ మీద అబూ కీర్ అనే కలంకారీ వాడు లేని నేరం మోపాడని నాకిప్పుడు అనుమానంగా ఉన్నది. నువు నా శత్రువుల పక్షాన రోమహరిణితో నన్ను చంపబోతున్నట్టు అతను నాతో చెప్పాడు," అన్నాడు.

అబూ సీర్ కళ్ళలో నీరు తిరిగింది. అతను రాజుతో అబూ కీర్ మొదటి నుంచీ తనకు చేసిన ద్రోహాలన్నీ చెప్పి, "రోమహరిణి అనేది తింటే ప్రాణాపాయం గాని దాన్ని పై పూతగా మా దేశంలో, ప్రతి ఒక్కరూ వాడతారు," అన్నాడు.

రాజు అబూ సీర్ మాటలు విశ్వసించాడు, కాని అబూ సీర్ కోరిన మీదట సత్రం దర్వానునూ, అబూ కీర్ దగ్గిర పనిచేసే వాళ్ళనూ పిలిపించి, అబూ సీర్ చెప్పినదంతా నిజమని రుజువు చేసుకున్నాడు.



తరవాత ఆయన తన భటులతో, "మీరు వెంటనే వెళ్ళి కలంకారీ అబూ కీర్‌ను వున్నవాణ్ణి వున్నట్టు పెడరెక్కలు విరిచి కట్టి తీసుకురండి," అన్నాడు.

భటులు వెళ్ళి, అబూ కీర్‌ను పట్టుకుని, అతన్ని తన్ని కింద పడేసి, పెడరెక్కలు విరిచి కట్టి, రాజ సభకు ఈడ్చుకు వచ్చారు. ఈ పాటికి చచ్చిపోయి ఉండవలసిన అబూ సీర్ దర్బారులో రాజు పక్కనే కూర్చుని ఉండటం కనిపించేసరికి, అబూ కీర్‌కు దడ పుట్టుకొచ్చి, తన ఆట కట్టినట్టు అర్థమయింది.

రాజు అతనితో, "ఇతను నీ మిత్రుడు. ఇతన్ని దోచావు, అవమానించావు, తిట్టావు,

కొట్టావు, వంచించావు. చివరకు చంపించ టానికి ప్రయత్నించావు. భగవంతుడి అను గ్రహం చేత అతను చావలేదు. ఇదంతా కాదనగలవా?'' అన్నాడు.

''కాదనలేడు! ఎలా కాదంటాడు?'' అని సాక్షులు గట్టిగా అరిచారు.

రాజు తన భటులతో, ''ఈ దుర్మార్గుణ్ణి కాళ్ళు పట్టుకుని ఈడ్చుకుంటూ నగర మంతా తిప్పి, సున్నపు రాళ్ళ గోతంలో పెట్టి కట్టి, సముద్రంలో పారెయ్యండి,'' అన్నాడు.

అబూ సీర్ ఆవేదనపడుతూ, ''మహా రాజా, నా మనవి విని ఇతన్ని శిక్షించకండి. ఎన్ని ద్రోహాలు చేసినా నేను ఇతన్ని క్షమించ గలను!'' అన్నాడు.

''నువు క్షమించినా, నేను క్షమించను. భటులారా, వీణ్ణి తీసుకుపొండి,'' అన్నాడు రాజు కోపంగా.

రాజభటులు అబూ కీర్ చేసిన ద్రోహ లను ప్రజలకు చెబుతూ, నగరమంతా ఈడ్చుకుంటూ పోయి, సున్నపు రాళ్ళ గోతంలో అతన్ని కట్టి, సముద్రంలో వేశారు. సున్నపురాళ్ళ ఉడుకుతూ, నీటిలో మునగ టానా అబూ కీర్ చచ్చాడు.

రాజు అబూ సీర్‌తో అతనికి ఏం కావా లన్నా ఇస్తానన్నాడు.

''మహారాజా, నాకు ఇంటికి పోవాలని తప్ప మరే కోరికా లేదు,'' అన్నాడు అబూ సీర్.

''నిన్ను నా మంత్రిగా ఉంచుకుంటాను, ఉండవా?'' అన్నాడు రాజు.

అబూ సీర్ ఉండనన్న మీదట రాజు అబూ సీర్ కోసం ఒక పెద్ద ఓడ సిద్ధం చేయించి, దాని నిండా ధనరాసులూ, ఆడ, మగ బానిసలూ నింపి, అతన్ని అలెగ్జాంద్రి యాకు పంపేశాడు.

అబూ సీర్ అలెగ్జాంద్రియా రేవులో దిగే సమయానికి అక్కడికి ఒక గోతం కొట్టుకు వచ్చింది. అందులో అబూ కీర్ శవం ఉన్నది! అబూ సీర్ ఆ శవాన్ని సముద్ర తీరానే సమాధి చేయించాడు.

—(అయిపోయింది)

